# శ్రీ వేంకటేశ్వర శతకము





"This Book is Published with the financial Assistance of Tirumala Tirupathi Devasthanam under their Scheme. Aid to Publish Religious Books".

రచయిత :

నూతలపాటి వెంకట రత్న శర్మ
M.A. (Telugu)

సంవత్సరం : 2000
కాపీలు : 1000


వెల రూ॥ 6/-

## అంకితం

ఈ శతక కావ్యాన్ని శ్రీ వేంకటేశ్వర స్వామి వారికి భక్తితో అంకితం యిచ్చుచున్నాడను.

-రచయిత

(ఇది తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయముతో ప్రచురించబడినది అందుకు దేవస్థానం వారికి సర్వదా కృతజ్ఞుడను.)

# ముందు మాట

శ్రీ వేంకటేశ్వర స్వామి వారి పై చాలమంది శతకాలు వ్రాసియున్నారు. నిత్య నూతనంగా కనిపించే స్వామి వారి అందాలు, లీలలు ఎల్లరకు అనుభవైక వేద్యమేకాని ఇంతని చెప్పటకు మనమెంత వారము. అయినను నా శక్తి కొలది ఈ శతకమును రచయించితిని. ఇందులో వరుసగా క్షేత్రవర్ణన, స్వామివారి భక్తుల గాధలు, స్వామి వారి లీలలు, దశావతార విశేషములు, సామాజిక సమస్యల నివేదన. ఆత్మ నివేదన మున్నగు అంశములను స్పృశించితిని.

స్వామి వారి పాదార్చనకై నాచే రచించబడిన ఈ శతక కుసుమాన్ని సహృదయులాదరింతురుగాక యని విశ్వసించుచున్నాను. నా ఈ తొలి కృతియందు దోషములున్న యెడల మన్నింతురు గాకయని ప్రార్ధించచున్నాను.

నాకీ జన్మను ప్రసాధించిన తల్లిదండ్రులు సుబ్బారావు నాగేశ్వరమ్మ గార్లకు వేద, సంస్కృత పాండిత్యములు గరపిన మద్గురు వర్యులు పామర్తి నాగభూషణ శర్మ గార్కి ఎంతో రుణపడి ఉన్నాను. ప్రోత్సాహించిన మిత్రులందరికి, మరియు అందంగా ముద్రించి ఇచ్చిన సందీప్ ప్రింటర్స్ విజయవాడ వారికి అడగగానే అందమైన బొమ్మ గీసి ఇచ్చిన సోదరుడు ఓంకార్ గార్కి, ముఖ్యంగా ఈ శతకము ముద్రణకు ఆర్ధిక సహాయము చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యానికి సర్వదా కృతజ్ఞుడను.

ఇట్లు

బుధజన విధేయుడు

రచయిత

## మహా మహోపాధ్యాయ
## రాష్ట్రపతి సన్మాన విభూషిత
### బ్రహ్మశ్రీ డా॥ పెదపాటి నాగేశ్వరరావు ఎం.ఎ.పి.హెచ్.డి.

'కలౌ వేంకటనాయకః' యనునది జగద్విదితమైన ఆర్యోక్తి. ఆంధ్ర ప్రదేశమున వేంకటేశ్వరుడు ప్రతి మనుష్యవతును ఇలవేలు పై నిత్యార్చనలు గొనుచున్నాడు. కలియుగ వైకుంఠమని ప్రఖ్యాతినంది, వేంకటేశ్వరుని నిత్యనివాసమైన తిరుపతి ప్రపంచమున కంతటికిని పేరెక్కిన తీర్థక్షేత్రము. ఆదేవుని పై పాటలు, పద్యములు, స్తోత్రములు, కావ్యములు, ప్రబంధములు, కోకొల్లలుగా వెలువడినవి. ఇంకను వెలువడుటకు తిరుమల తిరుపతి దేవస్థానముల వారు ఏతాదృశ రచయితలకు ఇతోధికమైన ఆర్థిక సహాకార మొసర్చి వివిధ గ్రంథములను వెలయజేయుచున్నారు. అట్టి మహాస్రవంతిలో ప్రస్తుతము మన ముందున్న గ్రంథ మొకటియని వేరుగా చెప్పనవసరము లేదనుకొందును.

ఆంధ్రుల ఆరాధ్యదైవమైన వేంకటేశ్వరుని పై తాళ్ళపాక కవులు తొలిసారిగా శతకములు. కీర్తనలు, మొదలైన గ్రంథములను వెలయించి వేంకటపతి కీర్తిని నలుదిక్కులకు చాటినారు. నిన్నమొన్నటి వరకు తెలుగు నాట తెలుగు చదువు శతకములతోనే ప్రారంభమై అలరారెడిది. కవియైన వారు తప్పక శతకరచన చేసి తీరెడి అలవాటుండినది. కనీసము పది పన్నెండు శతకములు కంఠస్థము చేయనిదే వీధి బడి చదువు ముగిసెడిది కాదు. ఇప్పుడు ఈ శతకముల నంత భక్తిశ్రద్ధలతో చదువు వారు తగ్గినట్లే చెప్పవలెను. ఐనను తెలుగు నాట శతకముల రచన ప్రచురణలు నిరాఘాటముగానే జరుగుచున్నవి కదా!

ప్రస్తుత శతకము శ్రీ వేంకటేశ్వరుని స్తుతి ప్రధానమైనది. దీని రచయిత శ్రీ నూతల పాటి వేంకట రత్న శర్మగారు. వీరు బహుంకాలము సాహిత్యము నధ్యయనము చేసి మొదటి సారిగా నీశతకమును స్వామి భక్తితో వెలయించి తమ కవితా సాధనా ప్రారంభ ప్రతి పత్తి జూపుచున్నారు వీరి కవితాధారకు సాహిత్య దృష్టికి వీరి పద్యములే అద్దము పట్టుచున్నవి. ఆస్తికుడిగా,

ఏపని చేయగానయిన ఏర్పడ దైవ కటాక్షమేవలెన్
చేపకునీట నీదుటకు చేవను ఎవ్వరో నంగిరోకవన్
ఏపుగ పక్షికిన్నెగుర నెవ్వరు నేర్పిరి ధారుణిన్ సదా
ఆ పతి నీవుగా దలచి ఆశ్రయ మడ్గితి వేంకటేశ్వరా !

అంటాడు కవి.

ఇది యే వీరి ప్రథమ ప్రయత్నము కావున సంస్కరణగోరు ప్రయోగములును ఉన్నవనియు ఉత్తరోత్తరము మహాకావ్యములతో ఆరాధ్య సాహిత్య పిపాసువులకు ఆనందము కూర్చ గలవనియు ఆశించవచ్చును. శ్రియఃపతి ఆశీర్వాదములతో ఈ కవి గొప్ప గ్రంథములను వెలయింప గోరెదను.

ఆశీస్సులతో.....

హైద్రాబాదు

5-6-2000

ఇట్లు

పెదపాటి నాగేశ్వరరావు.

# రత్నపతకం

"కవిరత్న" శ్రీ నూతల పాటి వేంకటరత్న శర్మగారు విరచించిన "శ్రీ వేంకటేశ్వర శతకం" ఆమూలాగ్రంగా పఠించాను. ఇందులో ప్రతి పద్యం సానలదీరిన జాతిరత్నం.

శర్మగారి కవిత్వంలో ధార, భావం, భాష త్రివేణిలా సంగమించాయి. చిక్కని కవిత్వం, చక్కని నుడికారపు సొంపు శర్మగారి సొత్తు. కవి తాతత్వ మర్మాన్ని భక్తి ధర్మాన్ని పుష్కలంగా కల్గిన కవి శ్రీ వేంకటరత్న శర్మ గారు.

ఈ రోజుల్లో పద్యాలు రాసే కవులు అరుదుగా కనిపిస్తున్నారు. అటువంటి వారిలో ప్రకృత శతక కర్త అగ్ర గాములు 'కనిష్ఠి కాధిష్ఠిత కాళిదాసాభభూవ' అన్నట్లు శ్రీ వేంకటేశ్వర స్వామి పై వచ్చిన శతకాల్లో ఇప్పటికిది విశిష్ఠమైన కృతి.

కవి చక్కటి భావుకుడు అనడానికి ఈ పద్యాన్ని ఉదహరించ వచ్చు. ఆ నెల వంక తాను శిరమందల రారగ చూచియున్ ప్రభూ అనక నాగ భూషవిటులా పెను పక్షము నాశ్రయింపని న్నానజాత భర్తవని అంటిని......

ఈ భావం ఎంతో మనోహరంగా ఉంది.

అలా అంటే లక్ష్మీదేవి ఊరుకుంటుందా ?

చిరునవ్వు నవ్వింది - పొరపాటని.

శివుడికి పాము అలంకారమైంది. విష్ణువుకు పాన్పయింది. కవిభ్రమ పడ్డాడు. కాన లక్ష్మి ఆభ్రమను తొలగించింది. శర్మగారు ఈ పద్యంలో ప్రయోగించిన భ్రాంతిమదలంకారం....

'శివ కేశవులకు భేదమా

సుజ్ఞాన వంతులకు వాదమా !

అన్న వేదాంత తత్వంలోని శివ కేశవాద్వైతాన్ని ప్రతి పాదించింది.

రత్న శర్మగారు కవిరత్నమై రత్నాలు పొదిగి శ్రీ వేంకటేశ్వర స్వామికి అందించిన రత్నపతకం - ఈ శతకం.

24-6-2000
మార్కాపురం,

"విద్యా విశారద", "సాహిత్య సరస్వతి"

కన్నె కంటి రాజమల్లాచారి.
M.A., Ph.D.

రీడర్, తెలుగు శాఖాధ్యక్షులు,
యస్. వి. కె. పి. కళాశాల,
మార్కాపురం - 523 316.
ప్రకాశం జిల్లా.

# శ్రీ వేంకటేశ్వర శతకం

ఉ॥ శ్రీపతి వేంకటేశుడయి, శేషుడు పన్నుగ శేషశైలమై,
ఆ పరమాత్ము భార్యయగు నాసిరి తానలమేలు మంగయై,
తాపసముఖ్యులా వెనుక తక్కిన దేవతలెల్ల వెంటరా
కాపుర ముంటి రద్రిపయి, కారణ జన్ముడ! వేంకటేశ్వరా! (1)

ఉ॥ బారులు తీర్చినట్టి ఘన పర్వత పంక్తుల వంపు సొంపులన్
సారము గల్గినట్టి కడు చక్కని లోయలతోడ, రమ్యమౌ
భూరుహ కోటి తోడ, మరి భూరి సరస్సులతో, సుమాళితో
నీ రమణీయ ధామమిల నిత్యము భాసిలు వేంకటేశ్వరా! (2)

ఉ॥ సప్తనగాళి శేషుని నిసర్గ ఫణాళిగ నొప్పి నీ సము
ద్దీప్త గృహాంగణమ్ము పలుదేవ గణాదులకున్ నివాసమై
ఆప్త జనాళి కెల్లరకు నా యమరావతి తిర్పతింబలెన్
ప్రాప్తమయెంగదే! సకల పాప వినాశక! వేంకటేశ్వరా! (3)

ఉ॥ పన్నుగ నాశ్రయంబిది విపన్నులకెల్లను, ముక్తి మార్గమౌ
సన్నుత భక్త కోటికిని, సత్కవి వర్ణన కాట పట్టగున్
తిన్నగ పాపముల్ తొలగు తెన్నగు నీదు నగంబు లేడు నీ
కన్నను మాకు దిక్కెవరు కావగ రాగదె! వేంకటేశ్వరా! (4)

ఉ॥ అంబర చుంబితాలయము లంజలి యొగ్గుచు మిన్నునోకు మో
దంబున తొండమాను డీల దబ్బున తా నమరంగ సేయ లో
కంబులు మెచ్చ నిల్పితివి కమ్మగ పుష్కరణీ తటిన్ ప్రమో
దంబున, తొండమాను డీల ధన్యుడు చూడగ, వేంకటేశ్వర! (5)

ఉ॥ కొండలమీద నిల్చి తగ కొల్చెడి భక్త జనాళి కంతకున్
మెండుగ దర్శనం బొసగి మేలగు సంపదలిచ్చి యేలుచున్
నిండు మనంబునన్ జగతి నిల్పుచు, సాకుచు రక్షసేయు నీ
దండి తనంబు రమ్యము కదా! ప్రియదైవమ! వేంకటేశ్వరా! (6)

ఉ॥ తామర పూలు కల్గ నిది ధారుణి యొప్పెను పుష్కరాద్రిగా,
స్వామి నృసింహుడై నిలువ చక్కగ సింహనగంబుగాను, చిం
తామణి యంచు కోర్కులను తప్పక తీర్చుట చేత పిల్చిరీ
నామము లన్నగంబును ఘనమ్ముగ శ్రీహరి! వేంకటేశ్వరా! (7)

ఉ॥ జ్ఞాన నగంబటం చని రనాదిగ తెల్పి యొసంగుటన్, సదా
శ్రీనిలయంబు గావునను శ్రీగిరి పేరును పొందె, సామియున్
తానిట శ్రీనివాసుడయి దర్శనమిచ్చుట నీ నగంబు ని
ట్లానక శ్రీనివాసగిరి య· · టిరి భక్తులు వేంకటేశ్వరా! (8)

ఉ॥ పుష్కరిణీ జలమ్ము ఘన పుణ్య భరమ్మును పాపహారియున్
పుష్కలమైన సంతనము భూరి విభూతియు కల్గు ముప్పినన్
విష్కలు షాంత రంగమగు నీరజలోచన! ఇన్నియేల! ఈ
పుష్కరిణీ జలమ్ము కడుపూత చరిత్రము! వేంకటేశ్వరా! (9)

ఉ॥ పూత చరిత్ర గంగవలె పున్నెపు రాశియు పూజ్య తీర్థమున్
చేతమునొప్ప సామి కది చెన్నగు క్రీడల కాలవాలమున్
హేతువు రాజ్యలక్ష్మికి, సుహృజ్జన కోటికి మోక్షదాయి యున్
జాతికి నెల్ల పుష్కరిణి సర్వ మొసంగెడు వేంకటేశ్వరా! (10)

ఉ॥ ఆగతి నాడటన్ పరిభవానల తప్తమతిన్, రమాపతిన్
వేగవికుంఠ ధామమును వీడిన దానివి దుఃఖితుండవై
బాగుగనంతటన్వెదకి వారిజనేత్రను గానలేక నీ
వీ గతి కొండనుంటి వట యీ ప్రజభాగ్యము వేంకటేశ్వరా! (11)

ఉ॥ వెన్నలు చల్దులుం గుడిచి, విశ్వము నోటను చూపి నీవు నా
యన్నుల మిన్నకున్ సుగతులంతగ నిచ్చిన చాలనట్టి యా
అన్నుల మిన్నెయే వకుళ యైనిను వీడక, చేరియుండెడిన్
ఇన్నగ పుణ్యలీల లిటు లెన్నవి యెన్నుదు వేంకటేశ్వరా! (12)

ఉ॥ మస్తకమందు నా జట లుమాధవు కైవడి యొప్పి, చక్రమున్
హస్తమునందు దాల్చి హరియంశగ తోచితి వింతలో కడున్
విస్తగు, రుద్రుడైతో! హరివేయగుదో! అననేల యిద్దరన్
వాస్తవ మొక్క రూపమున వాసిగ కంటిని వేంకటేశ్వరా! (13)

ఉ॥ ఆనెలవంక తాను శిరమందలరారగ చూచియున్ ప్రభూ!
ఆనక నాగభూషలిటులా పెనువక్షము నాశ్రయింప ని
న్నానగ జాత భర్త వని అంటిని, అంతలో వక్షమందు ల
క్ష్మీ నగుమోము గాంచితిని కేశవ! శ్రీయుత వేంకటేశ్వరా! (14)

ఉ॥ భూమిని మర్త్యులెల్లరు ముముక్షువులై నినుచేరి నెమ్మదిన్
నీ మహిమా సహస్రములు నిండుగ సంస్తుతి సేయు చుండగన్
నీమది సంతసింప తగ నీ కరుణాయుత వీక్షణంబులన్
కామితకోటి తీర్చి మము కాచెడి దైవమ! వేంకటేశ్వరా! (15)

ఉ॥ ఆత్మయదొక్కటే అరయ నాకృతులెల్ల ననంతముల్, సదా
ఆత్మవిదుల్ వచింతురిటు లచ్చెరు వొందగ నేలనో, విశు
ద్ధాత్మను నమ్మినన్ మొదట దైవమ దొక్కటె పెక్కు నామముల్
ఆత్మనెరుంగరైరి మనుజాధము లక్కట! వేంకటేశ్వరా! (16)

ఉ॥ నొవ్వడు పాంచభౌతిక తనూ విభవంబది నిత్యమంచు, తా
క్రొవ్వును సంపదల్గలుగ, గొప్ప మదాంధు డగున్, గణింపడున్
నవ్వుచు గేలిసేయు ఘన నాస్తికుడౌచును, దా పిమ్మటన్
నెవ్వగ కల్గినన్ కలంగి నీదరి చేరును వేంకటేశ్వరా! (17)

ఉ॥ ఆదియు నంతమౌనెవరు? ఆత్మయు నాపరమాత్మ యెవ్వరో!
మేదిని నిండి యెల్లెడల మించిన కాంతి వెలుంగు నెవ్వరో!
పాదగు నెవ్వరీ మహికి ప్రాపొనరింపగ నట్టి పాపహా
రీ! దనుజారి! శ్రీకర! హరీ! కయిమోడ్చెద వేంకటేశ్వరా! (18)

ఉ॥ స్వామివి నీవు నెట్లెరుక సానివిగా తిరుగాడితే భువిన్
తామర సాక్షికై పడిన తామర తంపర లైన పాట్లు క
ట్టా! మరి యక్కజంబగును డంబములేలని ఇంక దేవరా!
తాము మావలెన్ నడిచి తప్పులనెంచకు వేంకటేశ్వరా! (19)

ఉ॥ తప్పిది యంచునిన్నుమట తప్పుగు నెట్లన జన్మజన్మలన్
తప్పని జంట మీరు తగధర్మము కాచెడి నాది దైవమై
మెప్పును పొందితీవు పరమేశ్వర! పెద్దవు, కాన ఒప్పగున్,
తప్పుకు నొప్పు కీవెగతి దైవమ! శ్రీయుత వేంకటేశ్వరా! (20)

ఉ॥ గంగయు గౌరియున్ గరళకంఠుని కిద్దరు భార్యలయ్యె, నా
డంగన లింపుగా పలువురయ్యెను చక్కని నల్లనయ్యకున్
మంగయు పద్మ నీసతులు మాయురె! దేవతలిట్లు సేయుటా?
అంగన లిద్దరొట తగదందుము మేమిట వేంకటేశ్వరా! (21)

ఉ॥ భక్తిగ నిన్ను గొల్చి పలుభంగుల జోగి తిరింగి కొండకున్
ముక్తిని కోరివచ్చి తగమెక్కులు తీర్చియు వేడ్కతో యధా
శక్తి నుపాయనంబులను చక్కగ నర్పణ సేయుచున్ భవ
ద్భక్తులు నిన్ తలంచి భవబంధము దాటరె వేంకటేశ్వరా! (22)

ఉ॥ కొందరు భూరి భూతి నిడి గొప్పగ నర్చన సేయు భక్తు లిం
కొందరు పెంచి నట్టి నెతి కొప్పులు కుప్పగనిచ్చు భక్తు లిం
కొందరు పుణ్యతీర్థములు కోరిక తీరగ చూచు భక్తు లి
ట్లందరు నిన్ను చేరుదురు నార్తుల కావర! వేంకటేశ్వరా! (23)

ఉ॥ ఒక్కడు హంతకుండు, మరియొక్కడు చెప్పగరాని దొంగ, వే
రొక్కడు దుష్టుడౌ నరయ, నొక్కొక డొక్కొక తీరు నుండియున్
పెక్కులు కష్టముల్ కలుగ పెద్దగ దు:ఖముపొంది దీనతన్
అక్కజమై నినుంగొలుతు రంచు నెఱుంగవె! వేంకటేశ్వరా! (24)

ఉ॥ వేంకట నాయకుందలచి వేదన సర్వము విన్నవించినన్
సంకటముల్ తొలంగు ఘన సౌఖ్యములుం గలుగున్ నిజంబుగన్
శంకలు తీరు పాపములు చప్పున బాయును వేనవేలు ని
ట్లింక శుభంబు లెన్నొయగు నేర్పడ జూచిన వేంకటేశ్వరా! (25)

ఉ॥ గుండెల నిండుగ న్నిలిపి గుంపుగ గొంతులు కల్పి కీర్తనల్
మెండుగ సేసినన్ వొసగ మేలగు నంచును, నీదురూపమున్
దండిగ కాంచినన్ సకల తాపములుందగ తీరునంచు నీ
అండను చేరి యుంటిమి దయంగనుమా మము వేంకటేశ్వరా! (26)

ఉ॥ నీ మహిమల్గడున్ వినియు నీ దగు రూపము చూడగోరి తా
మా మత మీ మతంబనక అచ్చుగ సీమలనుండి కూడ నీ
ధామము వేడ్క చేరుదురు తామసమింతయు లేకయున్ తమ
సామివి నీవటంచు నిను చక్కగ మ్రొక్కగ వేంకటేశ్వరా! (27)

ఉ॥ మూడగు నామముల్ నొసట ముచ్చట తీర్చియు శంఖ చక్రముల్
వేడుక చేతులం దొడిగి విందొనరించెడి రూపు రేఖతో
ఏడగు కొండలన్నిలిచి ఈగతి మండన మండి తుండవై
తాడిత పీడిత జనుల దైవమ వైతివి వేంకటేశ్వరా! (28)

ఉ॥ శైవమొ! వైష్ణవంబొ! యను చప్పుటి వాదము లెల్ల శుష్కముల్
దైవము దొక్కటే మరియు తామర తంపరలై జనించు పే
ళ్ళో! వగచే కలంగి ఎదలో కథలాడు సహస్ర నామముల్
కావున నెట్లు పిల్చినను కావగ రావయ! వేంకటేశ్వరా! (29)

ఉ॥ ఎంతటి వృక్ష రాజమున కెన్నగ నంతటి గొల్లియౌను కొం
డంతగ మున్న దైవమున కంతటి పత్రినొసంగలేము మా
చెంతను లేని సంపదకు చేతులు జాపగ నెంచకుండ మా
స్వాంతములందు భక్తిగని చల్లగ జూడము వేంకటేశ్వరా!( 30)

ఉ॥ ఈనిరుపేద భక్త జనులిచ్చెడి పుష్పమొ! పండొ! పత్రమో!
కానుకగా ముదంబునను గైకొని మాకు నొసంగు మింక డెం
దాన చెలంగు భక్తియది తావిని వీడని పూవువోలె నీ
పై నిరతమ్ము నిల్వగ నుపాయము నొక్కటి వేంకటేశ్వరా! (31)

ఉ॥ సంపదయున్న వాడె యిల సామియటన్నను నిన్ను మించు నే
సంపద నెంతవాడు మరి చక్కదనమ్ము కలట్టి వాడె పో
యింపుగ నాథుడన్నను మరెవ్వరి కందును నిన్ను మించెడున్
సొంపుల నింపు గూర్చు కడు సుందర దైవమ! వేంకటేశ్వరా! (32)

ఉ॥ నీ కొసగంగ నెంచిన యనేకము లప్పటి కప్ప కూడకో,
లేక యొకింత పిలుపియు లేకనో! ఏమరపాటు కల్గియో
నీకు నొసంగ కుండినను నేర్పున మొక్కులు గుంజు నంద్రునిన్
లోకులు వడ్డికాసుకొను లోకపతీ! ప్రభు! వేంకటేశ్వరా! (33)

ఉ॥ ముక్తికి త్రోవగా దలచి మున్నిల నన్నమయార్యుడెంతయున్
భక్తితొ కొండజేరి తన బాల్యమునన్ నిను గాంచి యంతనా
సక్తిగ వేల కీర్తనల సంస్తుతి సేసియు తా తరింపడే
భక్తిని పాదుకొల్పుటకు బాల్యము బంధమె! వేంకటేశ్వరా! (34)

ఉ॥ ఒక్కని రాక్షసాధముని యుక్కడగింపగ నాడు భూమిపై
నొక్కొక రూపమెత్తి తివి ఒర్పున దైవమ! నేడు ధారుణిన్
పెక్కురు రాక్షసుల్ కలిగి పృథ్విని శాంతి హరింపచేయనీ
వెక్కడ నుంటి వయ్య కడు నేమరపాటున వేంకటేశ్వరా! (35)

ఉ॥ సుందర రూపముం గనిన చూడ్కులు చూడ్కులు దేవదేవ! గో
విందుని నెమ్మదిన్ పొసగ వేడెడి జిహ్వలు జిహ్వలంచు నే
నందు నటన్న మున్ననడె యా కవి పోతన భక్తి తోడుతన్
పొందుగ పల్కనేది గతి ప్రోది యొనర్పుము వేంకటేశ్వరా!(36)

ఉ॥ చెప్పుల కాళ్ళతో నధివసించెదొ శేషుని కొండనో కవీ!
తప్పిది, శేషు డెవ్వరని? దైవము కాదొకొ! అంచుపల్కుచున్
అప్పుడు పెట్టెనమ్మ మధురాన్నము లింపుగ నన్నమయ్యకున్
చెప్పగ వచ్చునట్టి కవి, శ్రేష్ఠుడు నిక్కము వేంకటేశ్వరా! (37)

ఉ॥ భర్త గతించె బాల్యమున పట్టగ లేని విషాదమందు భూ
భర్తను నిన్ను నమ్మి మది ప్రార్థన సేయగ కొండ చేరినన్
ఆర్తుల కాచునట్టి భవదంఘ్రి యుగంబుల చెంత వేంగమన్
హర్తవటంచు నర్చకుల టారడివెట్టరె! వేంకటేశ్వరా! (38)

ఉ॥ బాల వితంతు వీవనుచు బంధువు లెల్లరు వేంగమాంబికన్
బేలను పట్టి ముండనము వేగనొనర్చె బలంబు మీరగా
ఆలయమందు నిల్చి శుచియై కొలనందున చేరి మున్గినన్
బేలకు వెంట్రుకల్ మొలిచె పెద్దగ నీదయ వేంకటేశ్వరా! (39)

ఉ॥ నీ తిరు పాద పద్మముల నెమ్మిగ నెమ్మది కొల్వ గోరుచున్
తా తిరుచూర్ణము న్నుదుట దాల్చి యటన్ వరదయ్య నిల్చి దే
వా! తెర తీయ రావె! యని పాడిన యంత తొలంగె చిత్రమై
ఆ తెర, నీ యనుగ్రహమె యంతయు కాదొకొ, వేంకటేశ్వరా! (40)

ఉ॥ సుందర రూపమున్ కలను చూచిన మీదట నన్నమయ్య నీ
అందము చందమున్ పదములందున బంధన సేసె, కండ్లకున్
విందొనరించు దివ్యమగు వేలుపు పెద్దవు నీదు రూపమున్
పొందుగ కాంచినట్టి కవి పుణ్యుడు నిక్కము! వేంకటేశ్వరా! (41)

ఉ॥ భూతియు భూపతి త్వమును పోయిన శంఖణ చక్రవర్తి యున్
నాతిని వెంట పెట్టుకొని నాడును వీడి మహాటవీ స్థలిన్
రాతిరి విశ్రమించి యభిరామగుణుంగని తీర్థమందు సం
ప్రీతి మునింగి నంగలిగె వెండియు రాజ్యము వేంకటేశ్వరా! (42)

ఉ॥ తారకు చంపి..న్ పిదప తానుగ పాపవిముక్తికై కడున్
నేరుగ నీదు కొండకును నేగి యటన్నొక ధార చెంగటన్
ధీరత షణ్ముఖుండు కడు తీవ్రముగా తప మాచరింప నా
ధార కుమార ధారయయి ధారుణి యొప్పెను వేంకటేశ్వరా! (43)

ఉ॥ వేద పురాణ శాస్త్రములు వీనుల విందుగ నాలకించిరో
ఆదిని నిష్ఠగా జపతపాదులొనర్చిరో ! లేదె ! యే గతిన్
పాదములంటిరో పరమభక్తులు భీముడు నా తమాల్నియున్
మోదముతో భుజించితివి మోక్షమునిచ్చుచు వేంకటేశ్వరా ! (44)

ఉ॥ స్వామి ! భవాంబు ధిన్మునిగి సంకట కోటికి నోర్చి వృద్ధునై
యీ మహినిన్ను గూర్చి నుతియింపుచునుంటిని కావుమంచునిన్
తామన సారపిల్వనొక ధారదరిన్ నిలుచుండ జేయ నా
డా ముది వగ్గు బాపడున్ను యౌవనుడయ్యెనె! వేంకటేశ్వరా ! (45)

ఉ॥ ముప్పది రెండు వేల పదముల్ కడు రమ్యముగా రచింపగా
నిప్పుడు లభ్యమయ్యెను పదే నగు వేలు, పఠింప నాపయిన్
చెప్పుమటంచు రాజడిగె చెప్పననెంగవి యన్నమయ్య బల్
తప్పిది భూపతుల్ కవుల దండన సేతురె! వేంకటేశ్వరా! (46)

ఉ॥ కల్గిన భక్తి తీవ్రతను కల్పన సేసె ననేక కీర్తనల్
కల్గిన తృష్ణచే మరల కల్పన సేయుమనంటి వీవు నీ
వల్గిన లోకముల్ నిలువవంచు నెఱింగిన యన్నమయ్య ని
న్నల్గగ నీయడున్ పిలువనాఁ యని పల్కెడి వేంకటేశ్వరా! (47)

ఉ॥ ఏ యువతీలలామ పలు యిక్కటు లోర్చెనొ తొల్లి సీతకై
ఆయమ పద్మయైజగతియందు జనింపగ గాంచి యెంతయున్
న్యాయము సేయనెంచి మును ఆమె కొసంగిన కోర్కె తీర్చగా
హాయిగ పెండ్లి యాడితివి, ఆర్తజనావన, వేంకటేశ్వరా! (48)

ఉ॥ గొప్పగ నాలయమ్మొ కటి కూర్చితి నీకని గర్వమొందెడున్
చెప్పును స్వర్ణ పుష్పముల సేవలసే యుదుసంచు నెంతయున్
ఒప్పడు నన్య భక్తులను ఉక్కడగింపగ తొండమానుకున్
గొప్పగ చేసి చూపితివి కుమ్మరి భీముని వేంకటేశ్వరా! (49)

ఉ॥ న్యాసము నుంచినట్టి తన ఆలును బిడ్డల నిమ్మటన్న వి
శ్వాసము కల్గ కూర్మునకు చయ్యన బల్కిన తొండమానుడా
దోసము నీకు చెప్పుకొనె దోషము భక్తున కంటరాదటం
చా సుతులన్న తిన్ బ్రతుకునట్లొనరించితె ! వేంకటేశ్వరా! (50)

ఉ॥ ధాతనుడా గురించి యొకదైత్యుడు సోమక నామధేయుడున్
ఘాతుక కృత్యమంచు వెనుకాడక వేదములెల్ల దోచె నా
డాతని మత్స్యమూర్తి వయి అంతకు సన్నిధికంపి వేదముల్
ధాత కొసంగి తీవు ఘనదైవమ: శ్రీకర! వేంకటేశ్వరా! (51)

ఉ॥ భూమిని చాప చుట్టగను పూర్వము చుట్టి హిరణ్య నేత్రుడున్
బాములు పెక్కు వెట్టకని వానిని చంప వరాహమూర్తివై
భూమిని జన్మమొంది యల భూసతి నింపుగ నుద్ధరించినన్
మేమవి చెప్పుకొంచు నినుమెచ్చుచునుందుము వేంకటేశ్వరా! (52)

ఉ॥ దైత్యులు వేల్పులు గడలి త్రచ్చెడినప్పుడు మంధరాద్రి నా
దిత్య విభుండవు కూర్మమయి తేజము నొప్పుచు మోసె మున్పునన్
సత్యము లోక రక్షణకు చాలిన నాథుడ వీవటంచు నిన్
నిత్యము మేము కొల్తుమయ నెమ్మనమందున వేంకటేశ్వరా! (53)

ఉ॥ దానవ చక్రవర్తి బలి దాన గుణైక సుశీలు డా గతిన్
తానమరావతిం గెలిచి దాని పతింగడు కష్టపెట్టినన్
జానుగ వామనుండవయి జన్మము నొందియు నాడు వీకమై
ఆనృప శేఖరుం దునిమినట్టి ప్రభుండవు వేంకటేశ్వరా! (54)

ఉ॥ పుట్టిన నాటి నుండి తనపుత్రుడు శ్రీహరి నామకీర్తనల్
గట్టిగ వల్లె వేయగని కంపరమెత్త హిరణ్య కశ్యపుం
డట్టుల హింసవెట్ట ప్రభు! యప్డు వెసన్ నరకేసరాకృతిన్
ముట్టి వధించి మించితివి పూర్వము శ్రీహరి! వేంకటేశ్వరా! (55)

ఉ॥ విల్లును పెళ్ళునన్ విరిచి విశ్రుత కీర్తిని జానకీసతిన్
ఉల్లము సంతసిల్ల సురలొప్పగ భూసురులెల్ల మెచ్చగాన్
చల్లగ పెండ్లి యాడితివచంచల విక్రమ నిర్జితారివై
అల్లన రావణుం దునిమినట్టి విభుండవు వేంకటేశ్వరా! (56)

ఉ॥ ధర్మము నుద్ధరింపగను ధారుణి కృష్ణుడవై జనించి తా
కర్మ రహస్యముం దెలిపి కర్రీటి, చూపియు విశ్వరూపమున్
పేర్మిని కౌరవాధముల పీచ మడంగగ చేసినాడవే?
ధర్మము రూపుగొన్న హరి! దానవ మర్ధన వేంకటేశ్వరా! (57)

ఉ॥ నాడవసూయ్య పుత్రు కరుణన్వరముల్గొని కార్తవీర్యుడున్
పీడలు పెక్కొనర్చినను పృథ్విని మార్కొను వారె తక్కొతా
పాడి దొరంగి ధేనువును బల్మిని గైకొని పోవ నుగ్రమై
నాడట గొడ్డలిన్ కరమునందగ బూనితె! వేంకటేశ్వరా! (58)

ఉ॥ కూటికి గుడ్డకున్ చెడిన కోట్ల జనంబుల పాట్లు చూచియున్
కాటికి కాళ్ళు చాపి బహుకాలము రొష్టుల బడ్డ వారలన్
మాటికి చూచియున్ కరగి మానుగ గౌతమ బుద్ధ రూపమై
మేటి మతంబు చూపితివి మేలగునంచును వేంకటేశ్వరా! (59)

ఉ॥ దుష్టుల సంహరింపగను దోర్బల మొప్పగ ఖడ్గమూని సం
తుష్టిగ సజ్జనుల్ బ్రతుక త్రోవను చూపుచు కల్కిరూపమై
కష్టము లెల్ల [illegible] ాపితివి కారణ జన్ముడ! ధర్మ తేజమున్
పుష్టిగ నిల్పినట్టి ప్రభు! బ్రోవగ రావయ! వేంకటేశ్వరా! (60)

ఉ॥ చిన్న తనాన గోపికల చీరలు దోచిన వన్నె కాడవో
వన్నెల చిన్నెలం గులుకు వారిజనేత్రల చెట్టపట్టి తో
వెన్నలు దోచి లేదనుచు వీనుల విందుగ పల్కితో ప్రభూ!
మున్నిల గోపకుండవయి పుట్టి జగన్నుత! వేంకటేశ్వరా! (61)

ఉ॥ అన్యుల నేనెఱుంగ ప్రభు! అంతట నిండిన నిన్ను తప్ప రా
జన్యుల సేవరోయు కవి చంద్రుల కైవడి చిన్నబిడ్డనై
స్తన్యము గ్రోలుటాది మరి చక్కగ నీమహి సంచరించు దా
కన్య మెఱుంగనట్టి మది నర్చన సేతును వెంకటేశ్వరా! (62)

ఉ॥ కొండల రాయు డండయయి కోర్కెల నేడ్తెర తీర్చుచుండ మా
కుండునె పాట్లు, నీదు నయనోత్పల యుగ్మము మాపయిం గృప
న్నిండుగ జూప పాపము లనేకము లంటునె! మా మనంబులన్
మెండుగ సేవ చేతుమిటు మెచ్చుచు నెప్పుడు వేంకటేశ్వరా! (63)

ఉ॥ ఎవ్వని ధామమీ జగతి నెన్నగ నన్నిట నగ్రగణ్యమౌ
ఎవ్వని నామమున్ పొసగ నెల్లరు కీర్తనలట్లొనర్తురో
ఎవ్వని రూపమున్నరులు నేర్పడ చూడగ నుత్సహింతురో
అవ్వన జాక్షు నట్టి నిను నర్చనసేతును వేంకటేశ్వరా! (64)

ఉ॥ నీ నయన ద్వయంబు గన నిర్మల దృష్టి కలుంగుమాకు నీ
యానన దర్శనంబు సకలాప్త జనావళి చూచినంత యా
మా నుదుట న్వెలుంగు ఘన మాన్యపు నామములా విధాత, మున్
మా నొసటన్ రచించిన రమాన్విత రేఖలు వేంకటేశ్వరా! (65)

ఉ॥ నిన్నతి భక్తి గొల్చి తగ నిల్చిరి నీదగు కంఠ సీమయం
దున్న లతాంత దామమటు లున్నతులై స్ఫుట కీర్తిమంతులై
మున్ను వెలింగినట్టి కవి పుంగవులన్న మయాదు లెల్లరున్
నన్నును చేరనిమ్ము విరినై నిను శ్రీపతి వేంకటేశ్వరా! (66)

ఉ॥ దొంగ యొకండు భూతికల దొడ్డ గృహస్తు యొకండు పూజసే
యంగ మనోంతరస్థమగు నంచిత భావ విదుండవై తగన్
దొంగనె మార్తువో ఘనత ధూర్తుని మెచ్చి గృహస్తు నేతువో
తుంగ నగాధివాస! ప్రభు! దోయిలి దేకొను వేంకటేశ్వరా! (67)

ఉ॥ నేమము తప్పి దేవళము నేర్పుగ జొచ్చి కడున్ ధనాస్థచే
హేమ విభూషణావళిని హీనమనస్కులు తస్కరించుటల్
స్వాముల నిస్సహాయతయు చాలగ విన్న జనాళి మూఢులై
స్వామియె మిధ్యయంచనిరి సప్తగిరీశ్వర! వేంకటేశ్వరా! (68)

ఉ॥ నీ మహిమా సహస్రములు నేడు కలిన్ కనరాక యుండుటన్
ఈ మహి నుద్భవించెను గదే! ఘన నాస్తిక సంఘముల్ భళీ!
తామెరుగంగ జాలరుగ దైవము, నగ్నియు ప్రాణవాయువై
ధామము నుంట సప్తగిరి ధామ! ప్రభూత్తమ!వేంకటేశ్వరా! (69)

ఉ॥ చేసిన గొప్ప యెల్ల తమ చేతి దయంచు నహంకరించుచున్
చేసిన తప్పులెల్ల తమ చేతుల లొచ్చులుగా తలంచుచున్.
ధ్యాస'ను నొక్కచో నిలిపి తాగుణ దోషము లెంచి పొందు నా
యాసము సర్వ మీశ్వర మయమ్మని నేరక వేంకటేశ్వరా! (70)

ఉ॥ చేతను శంఖుదాల్చి యొక చేతను చక్రము పూని యింక డా
చేతితొ మోక్షమిచ్చుచు, ఇసీ యని రోయు భవాబ్ధిలోతు నో
చేతితొ చూపుతున్న తవ చిన్మయ రూపము చూచినన్ కలిన్
పాతక ముల్దొలంగును శుభంబులు కల్గును వేంకటేశ్వరా! (71)

ఉ॥ పావన పాప నాశమున ప్రాప్తము మేరకు మున్కులాడి ఆ
ర్తావన రక్షకుండవని ఆపదమొక్కుల వాడవంచు భ
క్తావళి పాలిటం దొరికె కల్ప మహీజముగా నటంచు సం
భావన చేసి కొండకయి పర్వులు పెట్టరె!వేంకటేశ్వరా! (72)

ఉ॥ పిల్లలు పాపలంచనక వృద్ధుల నింతుల చూడకుండ నా
యల్లరి మూకలుం బెను యహంకృతి చేసెడి ఘోరకృత్యముల్
చల్లిన రక్తధారలిల జాతికి భీతిని గొల్పుచుండె భీ
తిల్లిన యంతరంగముల దేర్పగ రావయ!వేంకటేశ్వరా! (73)

ఉ॥ నాదు మతమ్ము మేటి మరి నాదు కులమ్మొఘనంబుగా సదా
వాదన చేసి వెండియు నవారిత హింస చెలంగ మానవుల్
మేదిని శాంతినేపగ నమేయ పరాక్రమమప్డు చూపుటన్
వేదన పొందు చుంటి మిక వేగమ రావయ వేంకటేశ్వరా! (74)

ఉ॥ ఏ చరణార విందమది యేర్పడ గంగకు జన్మహేతువో
ఆచరణార విందమె యహల్యకు శాప విముక్తి కారకం
బా చరణార విందమరయన్ బలిపీచమడంచె నింక ఆ
నీ చరణంబె రక్షయగు నిత్యము మాకును వేంకటేశ్వరా! (75)

ఉ॥ ధారుణి వేంకటేశు సమదైవ మొకండిక లేడు పోల్చగన్
ధారుణి వేంకటాద్రి సమధామ మొకండిక లేడు చూడగన్
సారెకు నిన్ను చేరు జనసంద్రము భావనలిట్లు సేసి నిన్
చేరుదు రయ్య వారి ఘనసేవను పొందుము వేంకటేశ్వరా! (76)

ఉ॥ మొన్నటు మంగతో చెలిమి మోహము రేపిన ఊసులేమిటో
నిన్నటు పద్మతో సరస నిర్మల పూర్ణ సరాగమే మొకో
చిన్నగ యిద్దరాంధ్ర వల చిక్కి వగన్ విలవైతివే ప్రభూ!
నిన్నని ఏమి లాభమిక నేరము లెంచవు వేంకటేశ్వరా! (77)

ఉ॥ ఏ పని చేయగా నయిన ఏర్పడ దైవ కటాక్షమే వలెన్
చేపకు నీట నీదుటకు చేవను ఎవ్వరొసంగిరో కనన్
ఏపుగ పక్షికిన్నెగుర నెవ్వరు నేర్పిరి ధారుణిన్, సదా
ఆపతి నీవుగా దలచి ఆశ్రయమడ్గితి వేంకటేశ్వరా! (78)

ఉ॥ నీదు వివాహ వేడుకకు నీవు కుబేరుని చెంత నప్పుగా
నా దివసంబునం గొనిన యర్థము సర్వము వడ్డీతో సహా
లేదన కిచ్చుచున్ జనుల లేమికి నప్పను మాట చూపి ఈ
మేదిని కింత మేలిడిన మేటివి శ్రీకర! వేంకటేశ్వరా! (79)

ఉ॥ మానవ జన్మమెత్తి తగ మానవ జీవన పద్ధతిన్ సదా
న్యూనత చూపకుండగ వినూత్నత నుండిన నీకు నక్కటా!
ఆనక నన్యులట్లు పెనునప్పును, వడ్డియు, కోర్టు సాక్ష్యముల్
మానుప రానివయ్యెనిట మాయని మచ్చగ వేంకటేశ్వరా! (80)

ఉ॥ భక్తుని హృత్స రోరుహము పాయని వాసము గాగనుండి ఆ
సక్తిగ నీదు నామముల సంస్తుతి సేసెడి నాల్కలన్ యథా
శక్తిగ నిల్చి భక్తులకు చక్కని మేలొనగూర్చు టొక్కటే
యుక్తముగా తలంచెదవొ! యోగి వతంసమ! వేంకటేశ్వరా! (81)

ఉ॥ పాయక లోక బాంధవుడు భానుడు తేజ మొసంగు నెట్లు తా
మాయని వెన్నెలెట్లొ సగు మానవ జాతికి చంద్రుడున్ సదా
ధ్యేయము తప్పకుండ తమదిక్కు తిరుంగు గ్రహంబులెట్లు నీ
సాయము లేక లోకములు చక్కగ నిల్చునె! వేంకటేశ్వరా! (82)

ఉ॥ గొప్పగ పెంచుకొన్న నెఱి కొప్పున ప్రేమను డుల్చి వేసి మా
తప్పిదమున్ క్షమింపు మని దైన్యముతో తలలొగ్గి నిల్చి ఆ
కొప్పును నీ కొసంగి తమకున్న యహంకృతి పోయి నట్లుగా
నప్పుడెదన్ తలంత్రు కద! ఆర్తజనావన! వేంకటేశ్వరా!(83)

ఉ॥ ఎక్కడ లేరె వేల్పులని యింపుగ పల్కెడి భక్తులెల్ల తా
మెక్కడొ దూరభూములకు నేగుట ఏలయటంచు పల్కుచున్
యిక్కటు లేర్పడంగ నీను నెప్పటి యట్టుల సేవ సేయగన్
చక్కగ కొండ చేరుదురు చల్లగ చూడుము వేంకటేశ్వరా! (84)

ఉ॥ నా మది నుద్భవించిన ననంత వినిర్మల భావముల్ కడున్
దామము నేర్చి గూర్చి మెడ దాల్పగ చేసెడి భక్తియున్ సదా
నామముల స్తుతించు కవనాద్భుత శక్తియు నాదు జీవమున్
ఈ మహి నీవె గాక మరియెవ్వరు లేరిక వేంకటేశ్వరా! (85)

ఉ॥ భాగ్యము లెన్ని యున్నను సభాంతర మన్నన లెన్ని పొందినన్
యోగ్యములైన వస్త్రములు యుక్తముగాగ ధరించినన్ సదా
భోగ్య పదార్థమెంతొ తగ పొందియు నే విషయాదులందు వై
రాగ్యము లేని వానికిని రాదుగ మోక్షము వేంకటేశ్వరా! (86)

ఉ॥ నిత్యము పొట్ట కూటికయి నీతికి నిల్చి జనుల్ శ్రమించినన్
సత్యము పట్టెడన్న మది సాధ్యము కాకయునుంట వారి దౌ
ర్గత్యము గానుగెద్దుగతి గాడిని తప్పని జీవితాన నౌ
ద్ధత్యము లేదు భక్తి సుమదామము నిమ్మిక వేంకటేశ్వరా! (87)

ఉ॥ కొమ్మల గన్న యమ్మలకు కోరక సంకటముల్ కనంబడున్
ఇమ్మహిచాలకట్నముల నిమ్మని కోరెడి అత్తవారి గొం
తెమ్మల గోర్కె తీర్చి కడు తృప్తి నటించెడి తండ్రులెల్లలో
కమ్మున నిస్సహాయులరు కావగ రావయ! వేంకటేశ్వరా! (88)

ఉ॥ స్వార్థము మించి మానవుడు సారవిహీనపు జీవనమ్ములో
అర్థ మొకండు కూర్చుకొని అయ్యది చాలు సటంచు క్రొవ్వునీ
వర్ధము కావు వానికిని వాసిగ కీర్తన సేయుటొక్కటే
అర్థుల పాలిటింక పరమార్థము కాదొకొ! వేంకటేశ్వరా! (97)

ఉ॥ లోకము నందు మెల్లగ విలుప్తము లాయెను మంచి చెడ్డలున్
శోకము పెచ్చుమీరెను విశుద్ధపు ధర్మము భ్రష్టమయ్యెడిన్
వ్యాకుల మందె జీవితములందున నమ్మక మంత రించెడున్
తేకువ జారిపోయె కలదేదయ మాపయి వేంకటేశ్వరా! (98)

ఉ॥ ఈ చదువుల్ కడున్ చదివి ఏ పదవుల్ తగ పొందజాల మా
యెన్, చమరింప దేహమది ఎంతగ పాటుపడన్ ఫలంబులే
దే! చనె మంచి రోజులవి, దేశపు రీతిటులుండె, మాదునో
రాచిన దైవమిా వెగద! రాగదె! శ్రీయుత వేంకటేశ్వరా! (99)

ఉ॥ ఉత్సవ వేళ భక్త జనులుల్లము సంతసమంద పాడుచున్,
ఉత్సుకతన్ తిరుంగుచును, నూయల లూగుచు నేగు నిన్నునే
త్రోత్సవ మొప్పగాంచుచును, తోరపు భక్తి సెలంగి యుండెడున్
కుత్సిత భావ దోషములు కోల్పడి నీదయ వేంకటేశ్వరా! (100)

ఉ॥ ఈపుర వీథులన్ సతులనిద్దరతో విహరించు నిన్ను నా
నూపుర మంజుల ధ్వనులు, మాత్నపు కాంతులొసంగు హారముల్
తాపిన కోటి రత్న మహితంబగు నూత్న కిరీట మొదలన్
ఏపుగ గాంచినన్ ప్రజ కభీష్టము తీరెడు వేంకటేశ్వరా! (101)

ఉ॥ దిక్కుల మ్రోగు కీర్తనలు దివ్యము గావిని దేశ దేశముల్
ఇక్కడ వచ్చి చేరిన విదే తరుణమ్మని నిన్ను చూడగన్
ఎక్కడ పోదువింక విను మియ్యెడ శ్రద్ధగ విన్నపాల్ కడున్
మ్రొక్కిన నెప్పుడియ్యవట ముక్తిని దేవర! వేంకటేశ్వరా! (102)

ఉ॥ తిన్నగ తిండి లేదు తిని త్రేన్పగ, కట్టగ గుడ్డ లేదికన్
చెన్నగు గూడు లేదు మరి చింతలు లేక వసింప మాకిలన్
కన్నవి విన్నవౌ కథలు గాథలు ధైర్యము నిచ్చి పంపుటన్
నిన్నిట గొల్వ వచ్చి తిమి నీరజలో చన! వేంకటేశ్వరా! (103)

ఉ॥ కన్నులె! కావు తామరలు గాని, కరమ్ములె! కావు కావు ఆ
చెన్నగు తామరల్ మొలిచె, శ్రీపతి మోమది చంద్రబింబమా!
ఎన్నడు కాదు తామరది, ఇట్లగు, తామరసాక్షులిద్దరున్
అన్నిట నీకు జోడియగు నచ్చవు పోలిక వేంకటేశ్వరా! (104)

ఉ॥ స్వామివి భోగలాలసుడ వైతివి నిచ్చలు ఉత్సవాదులన్
కాముని బోలు మోముపయి కస్తురి పూతల గంధముల్, భళీ!
ఏమని ఏమి లాభమిక నిందర కొండకు పిల్చుకొంటివే
మా మొరలాలకించెదవో! మానెదవో! కదె! వేంకటేశ్వరా! (105)

ఉ॥ భోగము భాగ్యమున్ కలిగి పూజలు పెద్దగ గల్గి ధారుణిన్
నీ గతి ఎవ్వరుండరని నేర్పడ చాటితివింతకున్ భళీ!
మీగడ జుర్రువానికిని మేమిడు గంజి రుచించుటెట్లు? ఓ
భాగవతప్రియా! పరమపావన! శ్రీయుత వేంకటేశ్వరా! (106)

ఉ॥ భవ్యము నీదు నామ మదపార జనావళి ప్రస్తుతింపగన్
దివ్యము నీదు రూపమది దేవగణాదులు పూజసేయగన్
నవ్యము నీదు ధామమదనన్యము సుందర దర్శనీయమున్
సవ్యము నీదు సేవనము సర్వజనాళికి వేంకటేశ్వరా! (107)

ఉ॥ ఆ యలిమేలు మంగకును, ఆసురపూజిత దేవదేవికిన్
ఆ యనురాగ వల్లికిని, ఆ సతి పద్మకు వందనాలివే
ఆ యతిలోక సుందరుని కాయతి పూజిత దేవ దేవుకున్
ఆ యని మేష వంద్యునకు నంజలిదే కొను, వేంకటేశ్వరా! (108)

శుభం

91. పుట్టినతోడనే శిశువు బోరున నేడువ కుండి నంతనే
పుట్టిమునింగి నట్టు చలమున్ ముఖబింబము చిట్లు వారగా
గొట్టిజలంబు తోడ పసికూనను గొల్లున నేడిపింతు రా
పుట్టినయంత్ర నేడుపును బోసెదరుగ్గుగ వేంకటేశ్వరా !

92. మరణము జన్మతప్పదని మానస మందున చింతయేల నీ
చరణము లాశ్రయించి నిను సన్నుతి జేయుచు నైక్యమంద నా
నరునకు చావుపుట్టువుల నాశము తథ్యము మానవాళి యీ
వెరవు నెఱుంగ నేరరన వింతయెజూడగ వేంకటేశ్వరా !

93. వచ్చిననాడు పట్టుకొని వచ్చినవాడు గలండె సంపదల్
వచ్చిన నాడు పట్టుకొని సాగినవాడు గలండె యుర్విలో
వచ్చినవాడు వచ్చినటు వచ్చిన చోటుకి బోవుచుండగా
తుచ్ఛపు సంపదాళికయి తొట్రిలు టెందుకు వేంకటేశ్వరా !

94. గెలువగ వచ్చు రాజ్యముల గెల్వగవచ్చు విశిష్ట గద్దెలన్
గెలువగ వచ్చు శత్రువుల గెల్వగవచ్చు సురార్థకోటితా
గెలువగ జాలునే నరుడు క్రూర భయంకర మృత్యుదేవతన్
దెలియగ లేదు దీని గన తిర్మల దేవర! వేంకటేశ్వరా !

95. కాటికి బోవు నాడు తనకాయము కట్టెల గాలునాడు బల్
పాట్లుల నాలుబిడ్డలకు పాడి దొఱంగి గడించి నట్టియా
కోటి ధనంబులున్ సుతులు కూరిమి పెండ్లము వెంటవచ్చునే
యేటికి మట్టిలో గలయ నింతటి మక్కువ వేంకటేశ్వరా !

96. చొరబడి రోదసీ కుహర శోధన జేయును మానవుండు తా
దిరుగును నబ్ధి గర్భముల దెల్పును వాని రహస్యమంతటిన్
అరయును భూమిలో గలుగు నద్భుత వింతల నెన్నొ తన్నుతా
నరయగ లేడు చిత్తమున నారయ చిత్రము వేంకటేశ్వరా!

97. నడచును గాలిలోనయల నాగకులాంతకు రీతి నేర్పుమై
నడవగ నేర్చు నీటిపయి నావవిధమ్మున శాస్త్రవిజ్ఞుడై
నడవడి గల్గి భూమిపయి నాగరికంబుగ మానవుండు తా
నడువగ లేడు చిత్రమిది నారద సన్నుత వేంకటేశ్వరా!

98. లక్షకు, లక్షదెచ్చి మరు లక్షకు వడ్డికి వడ్డి గట్టియున్
శిక్షలు గల్గునంచుభయ శీలత లంచము నీకు నిత్తురే
బిక్షకు పాత్రుడైన కడుపేదకు గాసును వేయరేమిటో
కక్షను బూని వారియెడ కారులు గూతురు వేంకటేశ్వరా!

99. ధనమును ధాన్యమున్ ధరణి దండిగ సొమ్ములు వాహనమ్ములున్
మణులును మాన్యముల్ మిగుల మానిత కీర్తులు సుప్రతిష్ఠయున్
ఘనముగ నున్న నేమియవి కర్మ వశంబున వీడిపోవగా
క్షణమది జాలు నీదుకృప జాలకయుండిన వేంకటేశ్వరా!

100. బలమును బంధు వర్గమును బాధ్యత గల్గిన మిత్రబృందమున్
కలిమియు శౌర్యధైర్యములు కాలుని గెల్చెడి విక్రమంబునున్
గలిగిన యంతమాత్రమున గామితదాయక నీదుసాయమున్
గలుగక పోయినన్ నరుడు కార్యము పొందునె వేంకటేశ్వరా!

101. పట్టినదెల్ల పైడియగు పైకొని చెప్పిన దెల్లజెల్లు తా
నెట్టి దరిద్రుడైనను మరెంతటి శక్తి విహీనుడైన తా
పుట్టక గ్రుడ్డియైన నిలపొందును వెల్గును నీకృపాబ్ధినీ
యట్టి పరాత్పరున్ జగమునందున గానము వేంకటేశ్వరా!

# మంగళాష్టకము

1. శరణము సర్వభద్రమును శాంతి ప్రదంబును విశ్వమంతకున్
పరమ సుఖాస్పదంబు భవపాప వినాశ మటంచు దెల్ప నీ
వరద కరంబు జూపనల పావని బట్టిన శ్రీవదాలకో
నరసిజ నాభమంగళము సల్పెద గైకొను వేంకటేశ్వరా !

2. కాంచన మాలికా నికర కాంతి సముజ్వల సుందరాంగ నీ
కంచిత నీల రత్నముల హారశుభాకర నీలదేహ ! మా
సంచిత పాప కర్మముల సంహృతి జేసెడు పుణ్యదేహ ! నే
నంచిత దివ్య మంగళము లర్పణ జేసెద వేంకటేశ్వరా !

3. గిరివర సప్తకంబువయి కిన్నెర కింపురుషాంగనల్ బరా
బరులుగ నృత్యగానములు వాద్యవినోదము లందజేయగా
సరసత పద్మభూసతులు సఖ్యత నీకిరు ప్రక్కలుండనే
గురుతర మంగళారతుల గూర్చెద నీకివె వేంకటేశ్వరా !

4. తిరుమలపైన పుష్కరణి తీర పవిత్ర ప్రదేశమందునన్
సిరిదొరసాని రక్షుడయి శిష్టజనంబులు గొల్చుచుండగా
నరిజన భీషణుండయి యనంత జగంబుల నేలుచున్నయో
హరిహరశక్తి రూప శుభహారతులందుము వేంకటేశ్వరా !

5. జయజయ మంగళంబు లివె జానకి నాధుడు రామమూర్తికిన్
జయజయమంగళంబులివె జాహ్నవి బుట్టిన పాదదోయికిన్
జయజయమంగళంబులివె సర్వమయుండగు విశ్వనేతకున్
జయజయమంగళంబులివె సత్యసముద్ధర వేంకటేశ్వరా !

6. ఒక కరమందు శంఖము మరొక్క కరంబున చక్రరాజ మిం
కొక కరమున్ త్వదీయ చరణోన్నతి దిక్కని జూపుచున్‌ద
నకల జగాల గాతునను నంజ్ఞమరొక్క కరాన దెల్పుచున్
నుకరముగాగ భక్తులకు నుందర తిర్మల నుండు నట్టియో
నకల గుణాత్మ మంగళము నల్పెదగైకొను వేంకటేశ్వరా!

7. మాధవ కేశవా వరద మా నిజనాంబుధి పూర్ణచంద్ర దా
మోదర నీలదేహా వర మోహానరూప నురేశ నత్య భా
మాధవ రాధికార్ద్ర మయ మానన చోర ముకుంద యచ్యు
శ్రీధర మంగళమ్ములివె జెప్పెద గైకొను వేంకటేశ్వరా!

8. వేకువజామునన్ నకల వేలుపులెల్లరు వేయి రీతులన్
నీకయి నుప్రభాతముల నిర్మల బుద్ధిని సేవజేయగన్
చేకొని వారి సేవలను చెల్వుగ వెల్గెడి విశ్వరూప మా
నీ కివె మంగళారతులు నిండుగ నిచ్చెద వేంకటేశ్వరా!

మంగళం

ఓం

తత్సత్.

# నేను

తే॥ గీ॥ జనని లక్ష్మమ్మ వెంకటస్వామి తండ్రి
పరమపావన వలిగట్ల వంశజుండ
విష్ణు గోత్రమ్ము బుధజన వినయ్యుతుడ
పుడమి బూరగ మందనే బుట్టినూరు.

తే॥ గీ॥ స్థిర నివాసము వెంకటగిరి పురమ్ము
మేటి వెలుగోటి రాజుల పాఠశాల
తెలుగు పండితుడను నేను తెలుగుకవిని
సాయికృష్ణుడె యద్యాత్మ సద్గురుండు
భారతీయుడ హరికథా భాగవతుడ.